ప్రియా దెయ్యంగారు

*నేనొక ప్రియమైన పిశాచిని*

# ప్రేతాభిషేకం – ప్రేమాభిషేకం (దెయ్యాల) రీమేక్

MARCH 19, 2011 127 COMMENTS
(HTTPS://PRIYADAYYAMGAARU.WORDPRESS.COM/2011/03/19/%E0%B0%AA%E0%B1%8D%E0%B0%B0%E0%B1%87%E0%B0%A4%
%E0%B0%AA%E0%B1%8D%E0%B0%B0%E0%B1%87%E0%B0%AE%E0%B0%BE%E0%B0%AD%E0%B0%BF%E0%B0%B7/#COMMEN



“ప్రియా! ప్రియా!! ఎక్కడున్నావ్?” పరిగెత్తుకుంటూ వచ్చింది భజన

“ఏంటి భజనా? అంత ఉత్సాహంగా ఉన్నావ్?” అడిగాను నేను

” Just now తిక్కలోడి వ్యాసం విచిత్రమాలికలో చదివాను. అతను ప్రేమాభిషేకాన్ని రీమేక్ చేస్తారంటున్నాడు”

“అవును సిద్ధార్థ్ ని, కాజల్ అగర్వాల్ ని పెట్టి”

“కాదు ప్లేన్ మారింది. బ్లాగుల్లో అందరికన్నా పాప్యులర్ అమ్మాయివి నువ్వే ఇప్పుడు. అందుకే నువ్వే హీరోయిన్. రీమేక్ పేరు ప్రేతాభిషేకం” అంది భజన

“నేను సిద్ధార్థ్ తోనా?” నా తోకని నేనే నమ్మలేకపోయాను

“దురదృష్టవశాత్తూ, దెయ్యాలతో నటించటానికి సిద్ధార్థ్ ఒప్పుకోవట్లేదు”

“అయితే మరి హీరో ఎవరు?”

“యముడినే బెదరగొట్టిన మన శ్రీకాకుళం”

“శ్రీకాకుళమా?” నాకు నమ్మ బుద్ధి అవ్వలేదు

“నిజమే ప్రియా. మీ అక్క వైష్ణవి మీద ఒట్టు”

***************

అసలు కథకీ రీమేక్ కీ కాస్తైనా తేడా ఉండాలి కదా? రీమేక్ ఇలా ఉంటుంది.

శ్రీకాకుళం ప్రియ వెంట, అదే నా వెంట పడుతూ ఉంటాడు, ప్రేమిస్తున్నానంటూ. “నీకన్నా వయసులో చిన్నదాన్నిరా బాబూ. వదిన వరస అవ్వను. పైగా నాకు పెళ్ళికాకుండా పిల్లలు కూడా పుట్టలేదు. నీకు సరిపోను” అన్నా సరే వినిపించుకోడు

మధ్యలో 2-3 పాటలు

1. “బూచీ మౌనమా, పిశాచీ మౌనమా

నిన్నే శోధించి సాధించి బాధించి వేధించి

వలచిన ప్రియుని పైన

బూచీ మౌనమా, పిశాచీ మౌనమా”

2. “నా బ్లాగులు చెబుతున్నాయీ నిను ప్రేమించాననీ

వెబ్ సైట్లు చెబుతున్నాయీ నిను ప్రేమించాననీ

యూసరు చూడని, బ్రౌసరుకందని ఐపీ చెబుతోందీ

నేను ప్రేమించాననీ, నిన్నే ప్రేమించాననీ”

హీరో మీద ప్రేమ పుట్టి కాదుగానీ ఆ భయంకరమైన పాటలు వినలేక ప్రేమించేస్తుంది ప్రియ. ఇక పెళ్ళే అనుకున్న టైం కి .. షాక్! హీరో కి ఏదో బయటకి చెప్పుకోలేని వ్యాధి !!!!!

దెబ్బకి షాక్ తిన్న హీరో వందకి రెండొదలిచ్చి ఒక జపసుధని పట్టుకుంటాడు. ఆ సంగతి తెలిసిన ప్రియ తన చిన్ననాటి స్నేహితుడు మన్ రాజ్ ధనాధన్ ని పెళ్ళి చేసుకోటానికి రెడీ అయిపోతుంది.

అప్పుడు ఒక విషాద గీతం

3. “ఆగదు ఏ నిముషము ఈ శోకమూ

ఆగినా దాగదు ఈ రోగమూ

అసలే దాగదు ఈ రోగమూ

ఆగదూ ఆగదూ, ఆగినా దాగదూ

——

బ్లాగే సత్యమనీ, పోస్టులు నిత్యమనీ తెలిసినా కామెంటు పడక ఆగదూ

ప్రియ ఒక దెయ్యమనీ, భజనతో నెయ్యమనీ తెలిసినా తన వైపు నడక ఆగదూ

తనది నరకమనీ, నాది భూలోకమనీ తెలిసినా శ్రీకాకుళం పయనమాగదూ ప్రియ కోసమై తపన ఆగదూ

ఆగదు ఏ నిముషము ఈ శోకమూ

ఆగినా దాగదు ఈ రోగమూ

”

ఉన్నట్టుండి శ్రీకాకుళానికి bulb వెలుగుతుంది. “ప్రియ ఉండేది నరకంలోనే, ఈ రోగంతో నేను రేపో మాపో హరీ అంటే వెళ్ళేది ప్రియ దగ్గరకే కదా?”

ఈ ఆలోచన రాగానే హుషారొచ్చి గెంతుతూ ఉంటాడు

అయితే కహానీలో మరో ట్విస్టు.

శ్రీకాకుళమూ, మన్ రాజ్ ధనాధన్నూ ఒకే రోజు ఒకే ఆసుపత్రికి టెస్టులకి వెళ్లటం వల్ల మెడికల్ రిపోర్టులు తారుమారయ్యి ధనాధన్నువి శ్రీకాకుళానికి, శ్రీకాకుళానివి ధనాధన్నుకీ వచ్చేస్తాయి. ఆ సంగతి లేటుగా తెలుస్తుంది.

ఈ సంగతి చైనాలో మోటార్ సైకిల్ నడుపుతున్న ధనాధన్ కి ఫోనులో తెలిసినవెంటనే, షాక్ తిని ఒక పెద్ద బస్సుని గుద్దేసి తిన్నగా నరకానికే వెళ్ళి, తంతే గారెల బుట్టలో పడ్డిన చందాన ప్రియతో సెటిల్ అయిపోతాడు.

ఈ రెండో షాకు తట్టుకోలేని శ్రీకాకుళం పాపం … పిచ్చెక్కించుకుని … ఎందుకులెండి … ఢాం లోపాల వర్మ "దెయ్యం" సినిమాలా ముగింపు లేకుండా మిగిలిపోతుందీ చిత్రం!

FILED UNDER UNCATEGORIZED

## 127 Responses to *ప్రేతాభిషేకం – ప్రేమాభిషేకం (దెయ్యాల) రీమేక్*

**Rahmanuddin Shaik says:**
March 19, 2011 at 7:03 am
me first

**గలగలా గిన్నెల says:**
March 19, 2011 at 7:10 am
మీరు స్పందించినందుకు, బ్లాగు రాసినందుకు ప్రేతాధన్యవాదాలు

**పులుసు అబ్రకదబ్రమన్యం says:**
March 19, 2011 at 7:12 am
గోలూరు లో కాలువలు లేవనే వెళ్ళుతున్నాను. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను కాలువలు తవ్వడానికి .

**బకరాధ్యాజ్ మెల్లకన్ను says:**
March 19, 2011 at 7:18 am
I watched pretabhishekam twice so far .. it's ok now.

2 times happy .. then started struggle 😛

But HELL is value for money

**భకరాద్వాజ్ వెలమ"కన్నింగ్ " says:**
March 19, 2011 at 7:22 am
What is this pretabhishekam upto?

**భోగ ప్రసాద్. says:**
March 19, 2011 at 7:26 am
ఇప్పటికిప్పుడు అర్జంటుగా ప్రేతాభిషేకం చూడాలని డిసైడయ్యా…కాబట్టి, మంచి థియేటర్ ఎక్కడుందో చెప్పండి. అది దంచుగారి లాగ చిన్న థియేటర్ కాకుండా భవన్ లాగ పెద్ద థియేటర్ ఐ మ్యాక్స్ లాగా ఉండాలి. థియేటర్లో బొమ్మ చూస్తూ సౌండ్ వింటూంటే ప్రియా దెయ్యం లేచొచ్చి మనల్ని కరుస్తున్నట్టుగా ఉండాలి.

**సనైటా మన్ను says:**
March 19, 2011 at 7:33 am
ఎందుకలా?

**తీహారిక says:**
March 19, 2011 at 7:33 am


**కంచు పల్లకి says:**
March 19, 2011 at 7:37 am
పాటలు బాగున్నాయి

**జావా నే అందనంతదూరం says:**
March 19, 2011 at 7:39 am
అంతే కాదు ప్రియా 100 వంద సార్లు అరిస్తే 200 సార్లు అరిచినట్టుగా వినిపించాలి.

**మనసు కెలికే says:**
March 19, 2011 at 7:45 am
మళ్లీ మాకోసం బోలెడన్ని టపాలు రాస్తారని ఆశిస్తున్నాను:)

**బొప్పారావ్ రాత్రి says:**
March 19, 2011 at 7:48 am
సినిమాలకి దెయ్యాల వర్మ
బ్లాగులకి ఛీగోల శర్మ
అంతా నా ఖర్మ

**భాస్కర్ రోగరాజా says:**

March 19, 2011 at 7:49 am
నా బ్లాగులు చెబుతున్నాయీ నిను ప్రేమించాననీ
వెబ్ సైట్లు చెబుతున్నాయీ నిను ప్రేమించాననీ
మనుషులు చూడని, బ్రౌసరుకందని ఐపీ చెబుతోందీ
నేను ప్రేమించాననీ, నిన్నే ప్రేమించాననీ"



**రోగ ప్రసాద్ says:**
March 19, 2011 at 7:51 am
నిన్ననే ఆ సినిమా చూసా , తల నొప్పి వచ్చింది
కాకపోతే పాటలో కొంత క్లారిటీ మిస్ అయ్యింది

**భోగ ప్రసాద్ says:**
March 19, 2011 at 7:53 am
ఇవ్వాళ హోళీ పండగ కదా…పైగా పౌర్ణమి. పిచ్చెక్కిన దెయ్యాలన్నీ ప్రేతాభిషేకం సినిమా చూస్తూ భీభత్సంగా రచ్చ రచ్చ చేస్తున్నాయి. ఇట్లాంటి రంగుల జీవితం పౌర్ణమి నాడు పిచ్చెక్కితే తప్ప వాటికి రాదు.

**ఏవండీ డూప్ నేనే says:**
March 19, 2011 at 7:56 am
Yes!
Well said

**రెక్కమాను ఊడిన షేక్ says:**
March 19, 2011 at 7:59 am
అయ్యో ఆయనకి ఖర్మ అని పేర్లో వాడితే నచ్చదుట.

**రామ్ గోపాల వర్మ says:**
March 19, 2011 at 8:00 am
ఈ కధని రెండు రోజుల్లో సినిమా గ తీస్తా , ఎవడు అడ్డం వస్తాడో చూస్తా

**Bhardwaj Velamakanni says:**
March 19, 2011 at 8:03 am
What is this Deyyamgaaru upto?

**Bhardwaj Velamakanni says:**
March 19, 2011 at 8:04 am
నెక్స్ట నేసె

**చెవి రింగుని says:**
March 19, 2011 at 8:07 am
అటు దయ్యం ………….ఇటు దయ్యం ………..
మనసు ఎటు చూస్తే అటు దయ్యం ………

నిన్న చూసినా ప్రేతాభిషేకం………..ఇంకా భయం పోలేదు …సినిమా అయిపోయింది .. పుట్టి పెరిగాక అంత భయంకరమైన దయ్యాన్ని సినిమాలో చూడడం ఇదే ఫస్ట్ టైం … ఇక టీవీలో కూడా ఈ సినిమాని చూడను . …

.కళ్ళు మూస్తే కలలోకి కూడా వచ్చేస్తుంది ……… ఎప్పుడూ నిద్రపోయే నా నిద్ర మొహానికి కూడా నిద్ర పట్టడం లేదు …….. కళ్ళు మూయాలంటే భయం వేస్తుంది … నా నిద్ర కి బాగా దిష్టి తగిలింది

నిద్రపోకుండా ఎప్పుడూ కళ్ళు తెరిచే ఉంచాలి అనిపిస్తుంది

**Bhardwaj Velamakanni says:**
March 19, 2011 at 8:17 am
LOLLLLLLLL

**బెదురు కానీ says:**
March 19, 2011 at 8:30 am
మా స్మశానంలో ఒక క్షుద్ర దెయ్యం నన్ను చూసి పిల్ల దెయ్యం అంది.
దెయ్యాలకే లీడర్నైన నన్ను పిల్లదెయ్యం అంది ః)

అయినా, మనలో మన మాట.. ఎవరైనా ఇంత గొప్పగా పొగిడేస్తే.. ముడిసి ముక్కలైపోతాం గానీ.. ఎందుకు నొచ్చుకుంటాం అసలు! 😉 😀

**సేమ్యా ఆల్లంవారు says:**
March 19, 2011 at 8:46 am
"అద్దంలో చూసుకుంటే ఎవరికి వారు ద్దెయ్యంలా కనిపిస్తారు. అదే ముఖ్యం. ప్రపంచంలో నా అంత దెయ్యం ఎవ్వరూ లేరు అనే భావంతఙ ఉండాలి. అది గొప్ప ఆత్మవిశ్వాసాన్ని అందిస్తుంది. అదే దెయ్యంతనం అంటే" – కత్తెరనా కైపు

బాగా చెప్పింది కదూ! కాకపోతే ఈ కింది వాక్యం కూడా కలిపితే ఇంకా బావుంటుందేమో!

"వచ్చిన దెయ్యం దెయ్యంగార్ గా మారకుండా జాగ్రత్తపడాలి"

**ప్రవీణ్ says:**
March 19, 2011 at 9:11 am

దెయ్యాల గురించి రాస్తే భయపడతానని అనుకున్నాడు
**కాకివ్య says:**
March 19, 2011 at 10:51 am
Watching Pretabhishekam is a good feeling when it is created by Bhajana. But it is the most worse feeling when it is gifted by chee gola Sarma.

**బెత్తం says:**
March 19, 2011 at 10:56 am
నాకు ప్రేతాభిషేకం పేరడీ పాటలు వింటూ పనులు చేసుకోవడం అంటే మహా ఇష్టం…

**హస్తం says:**
March 19, 2011 at 11:12 am
కుళ్ళు నాగ కాల్లో ముల్లు నాగా నువ్వే కదా

**త్యాగ పెసాద్ says:**
March 19, 2011 at 11:15 am
హహ బెత్తం గారు yes, that credit card cross on me only.

**చేతిలోచాట says:**
March 19, 2011 at 11:18 am
నాదీ ఓ పప్పు గుత్తి వేసుకోండి. ఉగాది రోజు పచ్చడికి అయితే బాగుంటుందేమో కదూ! ఏప్రిల్ నాలుగో తారీకు ఉగాది

**భగన్ వ్యథ says:**
March 19, 2011 at 11:30 am
ప్రియా దయ్యం ఎవరిది?
A. భాగ్
B. దంచు
C. గార టీత్
D. బూజ్
E. క్రాకర్ జునా

**ఏపండీ డూప్‌నే says:**
March 19, 2011 at 12:11 pm
Voni's Mom: Go and bring Pretabhisekham piracy CD from market.
Voni: But Mom, We defeated by South Africa, and priya dayyam in full anger.
Mom: Wear voni and then go, priya dayyam won't recognize you.
Voni goes to market wearing Voni.
A Girl: Hi Voni, how are you?
Voni got shocked.
Voni: How did you know, I am Voni?
Girl: Abeh.. I am Bakra.

**KumarN says:**
March 19, 2011 at 2:16 pm
I don't know who this is, but this post is excellent. Infact, better than couple of earlier ones.

**ఉయ్యాల మందార says:**
March 19, 2011 at 2:53 pm
జై తేలంగాణా! జై జై తెలంగాణా!

**మధుర కళ్యాణి says:**
March 19, 2011 at 3:13 pm
వెన్నెల వానలో ప్రేతాభిషేకం అని టైటిల్ పెడితే మాంచి రోమాంటిక్ గా ఉంట్టుంది.

**బెదురు కానీ says:**
March 19, 2011 at 3:50 pm
ప్రతి బొంద మనకోసం అనుకోపడమే ఆనందం..
రుచి చూద్దాం అనుకుంటే మట్టైనా అది ఆనందం..
పిశాచమవడం ఆనందం.. డ్రామాలాడటం ఆనందం..
గీతాచార్యా అన్యనుకుంటూ గడిపే కాలం ఎంతో ఆనందం…

'ఆనందప్రేతం' సినిమా కోసం తీరుతెన్నుల జారు రాసిన వాక్యాలు.. భలే బాగున్నాయి కదా! :))

**డ్రాగాజ్ఞన says:**
March 19, 2011 at 5:40 pm
– ఓ మల్ల..గుల్ల గుల్ల …. ఈసారి ఎవన్ బ్లాగు బొంగయిందో తెల్సుకోనికే, ఎవరి బజ్జు బొగ్గు [కిరాతకం గా] ఐందో సూడనీకె బ్లాగు కామెంట్లను చూసే ఏకే బ్లాగు :

**నేనే మీ కాంత్ పోర్ల says:**
March 19, 2011 at 6:46 pm
నెత్తుటి కలలు కన్నా నిన్ను కునుకులేకనే
రుధిరమంత నిన్నే కన్నా దరికిరాకనే
నువ్వు లేక నాకు లేదు రక్తమన్నదే

మొన్న చంపేశావు మైమరచిపోయాను
నీగోళ్ళతో నన్ను తూట్లు పొడిచేసావే
ఇన్నేన్నినాళ్ళైనా నీ రక్త దాహం తీర్చలేక
ఎందెందు వెతికానో ప్రాణమే వృధా ఆయేనే
కపాలాల నీ కన్నుల కనలేని నా వేదన
ఈ రేయేనా తోడు వచ్చేయ్ ఇలా
స్మశానమంతా చూసేలా అవుదాం జత ||2||
దెయ్యమా .. దెయ్యమా.. దెయ్యమా ..

**Kelike Veera says:**
March 19, 2011 at 8:18 pm
నేనే మీ కాంత్ పోర్ల
Wuhahaha

**బర్మా గండుపిల్లి says:**
March 19, 2011 at 9:55 pm
good idea. మాకు నరకం అడ్రస్ చెపితే, నేను కుడా వచ్చి ప్రేతాభిషేకం లో ఓ కారక్టర్ రోల్ ప్లే చేస్తాను.
నేను సైతం.

**'భౌ'వ్య లొట్టిపిట్ట says:**
March 19, 2011 at 10:05 pm
బాబోయ్ ఎవరండీ హీరో, ఇంకే రోలు దొరకలేదా, మీ తల పెట్టడానికి.

అవునూ, వంకర్ గారు గొంగల్పూర్ లో కదా ఉండేది, ఇంతకు ముందు "చీ తుస్" లో ఉండేవారా

**గర్జేష్ G says:**
March 19, 2011 at 10:31 pm
:-)) అరదం అవ్వింది :-)) "భూగోళపు తోపు"కి కొంత మెదడు వాపు వ్యాధి ఉంది. అందుకే దూరం నుంచి ఈ సినిమా షూటింగ్ తీయాల్సిందే, "ఈ బ్లాగు డైరక్టరు" గారూ జాగ్రత్త.

**( కవితల) బాక్సర్ మర్దర్రాజు says:**
March 19, 2011 at 10:47 pm
నరకంలో మూడ్ ఎలా ఉందీ
భూగోళంలొ మూడ్ ఎలా ఉందీ
ప్రియా దెయ్యం చిలిపిగా ఉంది,
హీరో గాడికి దూలగా ఉంది,
వాణ్ణి చూసిన దెయ్యాలకి చొంగగా ఉంది,
ఇంట్లో "అమ్మ" కారక్టర్ అరుస్తూ ఉంది,
హీరో లేనందుకు శ్రీకాకుళం ప్రశాంతంగా ఉంది,
సాయంత్రం వైజాగ్ ట్రైనుంది,
ట్రైన్ పదం వినగానే గుండెల్లో దడగా ఉంది,
హీరో వంటినుంచి వాసనొస్తోంది.
ఇప్పుడే ఏదో అగ్ని టపా పేలబోతున్నట్లుగా సంకేతమందింది.
ఎవడికో మూడింది అని తీ(హీ)తువుపిట్ట కూసింది.

**భాస్కర్ రామరాజు says:**
March 20, 2011 at 12:25 am
అమ్మనీ ఎన్కమ్మల్లారా…

**బర్మా గండుపిల్లి says:**
March 20, 2011 at 1:30 am
యే దెయ్యంగార్ ఏక్ బహానా హై
యే బ్లాగ్ బొహత్ పురానా హై

**బర్మా గండుపిల్లి says:**
March 20, 2011 at 2:05 am
బర్మా బిల్లీ బహుత్ ఘరమ్ హై
శొచ్ తా హై, ఏ కామ్ హమారా భాయ్ కా హై
మేం సాహెబ్, కైసీ బాత్ బోల్తీ హై
పతా నై క్యా ఏ బ్లాగ్ మే బడా పిశాచ్ హై
హో సక్తా , ఏ కామ్ ఉస్ కా హై.

**చేతిలో చాట says:**
March 20, 2011 at 2:26 am
అదే మరి! దెయ్యం ఎవరో తెలుసన్నాం గానీ, మీరని అన్లేదు! మీరే వచ్చి రక్తం తాగుతున్నారు. అయినా మీరు దెయ్యం కాదని తెలుసు, ఎవరో కూడా తెల్సు!(దెయ్యమా, దీనికేం గారడీ చేస్తారో)

**చేతిలో చాట says:**
March 20, 2011 at 2:31 am
అనుమానం కాద నమ్మకమే! ఒక నాలుగైదారేడు దెయ్యాల మీద! కానీ భయపడడానికేముంది లెండి? బయటికి రాకుండా బ్లాగుల్లోనే ఉన్నాయి కాబట్టి భయపడకుండా నవ్వుకోడమే!

**బర్మా గండుపిల్లి says:**

March 20, 2011 at 2:32 am
గోమాత గారూ, మన పేర్లు గోడకెక్కాయి. మనకి ఇంతకన్నా ఏం కావాలి?

**గోమాత మనస్లోమాట says:**
March 20, 2011 at 2:34 am
చెప్పానా దెయ్యం రక్తం ఇక్కడ తాగేసి, అక్కడ కక్కేసింది.

**బర్మా గండుపిల్లి says:**
March 20, 2011 at 2:36 am
I like the posts from this blog, though I can't stand this blog owner

**బర్మా గండుపిల్లి says:**
March 20, 2011 at 2:37 am
I like the posts from this blog, though I can't stand the guy who gave me this "billi" name 😉

**గోమాత మనస్లోమాట says:**
March 20, 2011 at 2:40 am
ఛీ ఛీ చేతిలో చాటే బావుంది, గోమాత కన్నా. ఉండు పప్పు చేటలో చెరగి, పప్పుగుత్తి చేతిలో పట్టుకొని, ఈ పేరడీ గాళ్ళని ఆ పప్పులో చూసుకొని, బాఆఆగాఆఅ రుద్దుతా, నుజ్జు నుజ్జుగా

**భ్రాంతి Ch says:**
March 20, 2011 at 2:42 am
రాక్షసుల విగ్రహాల మధ్యలో ఈ గండుపిల్లులు అందునా బర్మావి, ఆ దెయ్యాలు ఏం చేస్తున్నాయి..?? అసలేం జరుగుతోందిక్కడ అధ్యక్షా…?!

**భ్రాంతి Ch says:**
March 20, 2011 at 2:44 am
ఓహ్! ఈ దెయ్యాన్ని ఎలా మిస్సయ్యానబ్బా..! Thanks for sparing me

**బర్మా గండుపిల్లి says:**
March 20, 2011 at 2:46 am
ఓఅత్తా, అందుకే నేను ఇందాకటి నుంచి ఇది కేడీ దెయ్యం పనే మొర్రో అంటున్నది. నువ్వింటేగా.
నమ్మకు నమ్మకు ఈ కేడిని,
ముంచుకు వచ్చిన ఈ బ్లాగుని

**ప్రియా దెయ్యంగారు says:**
March 20, 2011 at 2:46 am
నువ్వెవరో తెలిస్తే ఆవిడ చేసే పని రుద్దటం కాదు, రుబ్బటం – పప్పు రుబ్బినట్టు రుబ్బెయ్యటమే

**చేతిలో చాట says:**
March 20, 2011 at 2:50 am
అబ్బ, దెయ్యమంటే ప్రియా ఒక్కతే కాదండీ, ఇంకా ఉన్నారని చెప్పానుగా! స్మశానాల్లో కనపడకుండా దాక్కుని ఉంటాయి. అందరూ కల్సి నన్నేడిపాఇస్తున్నారు. అది కాదు, అన్ని చావులూ శవాలూ చూసి ఇన్ని దెయ్యాలు పేరడీ చేస్తున్నాయంటే చేతిలో చాట లేదంటారా? లేక కల్పించుకుంటున్నారంటారా? హమ్మో హమ్మో

**దుర్మాత బెదరపేట says:**
March 20, 2011 at 2:51 am
హబ్బ ఆయనొక్కరే కాదు కోడలా, ఇంకా ఉన్నారని చెప్పానుకా. చెట్టెక్కి, గబ్బిలాల్లాగా దాక్కున్నాయీ దయ్యాలు. అందరూ కల్సి రక్తం తాగుతున్నారు. అది కాదు కానీ, ఈ దెయ్యాలకి చేతిలో చేటలు లేవు, అందుకే వీటికి చేతిలో పని లేదు.

**బర్మా గండుపిల్లి says:**
March 20, 2011 at 2:57 am
సారీ ఓఅత్తా, మీరేమో అసలే ఇంగ్లీషు పేపర్లో వయసు దాచుకోవటమెలా అని చదువొస్తే మిమ్మల్నేమో అత్తని చేసేసారు. నేను కోడల్ని అయిపొయ్యాగా, జింగు చకా, జింగు చకా.

**చేతిలో చాట says:**
March 20, 2011 at 3:01 am
అయితే ఏమయిందిలే కోడలా. నా గోల సుత్తి కాస్తా డప్పు సుత్తి అయిపోయాక ఇంకేం చేస్తాం

అయినా అత్త కోడలికన్నా వయసులో తక్కువ ఉండకూడదన్న రూలెక్కడయినా ఉందా?

**చేతిలో చాట says:**
March 20, 2011 at 3:03 am
దుర్మార్గపు దెయ్యాల్లారా నన్ను నిర్మాత ని చేస్తారా

**గోమాత మనస్లోమాట says:**
March 20, 2011 at 3:04 am
కానివ్వండి కోడలా, గండుపిల్లి మీద దెయ్యం పడదా, అప్పుడీ పిల్లి "ఓ గోమాతా, నన్ను సేవ్ చేయ్" అనదా. అప్పుడీ దుర్మాత, సుమాత అయిపోయి నిన్నా దెయ్యం బారి నుంచి కాపాడదా? అప్పుడు తెలుస్తుంది, నా ఏజ్ పవర్, "మనసు" పవర్ ఏంటో.

**బర్మా గండుపిల్లి, says:**
March 20, 2011 at 3:07 am
అంతేలే సుమాతా, అత్త కోడలుకన్నా చిన్నగా ఉంటేనే నవసమాజ నిర్మాణం జరిగినట్లు ఈ బ్లాగులో హీరో ఎప్పుడూ మొత్తుకుంటాడు కదూ.

**బర్మా గండుపిల్లి, says:**
March 20, 2011 at 3:08 am

బర్మా గండుపిల్లి,
అంతేలే సుమాతా, అత్త కోడలుకన్నా చిన్నగా ఉంటేనే నవసమాజ నిర్మాణం జరిగినట్లు ఈ బ్లాగులో హీరో ఎప్పుడూ మొత్తుకుంటాడు కదూ.

**గల్లాసు says:**
March 20, 2011 at 3:08 am
దుర్మాత గారి శ్మశానంలో ఈ టపా లంకె దొరికింది.

అదరగొట్టారు.

**సృష్ణ says:**
March 20, 2011 at 3:11 am
"భలే తీసారండి శవాల ఫోటోలు..నేనూ అనుకున్నాను కానీ రోజంతా తిరిగివచ్చినమీదట శవాలకోసం వెతికే ఓపిక లేకపోయింది.పోనీలెండి నా సరదాను ఈ ఫోటోల్లో చూసేస్కుని తుత్తి పడిపోతాను..:)

**లస్కర్ రమ్యకిరాజా says:**
March 20, 2011 at 3:14 am
బొందలోభామ
ఘంటల చుట్ట

ఇవ్వేం సినిమాలు పిల్లలూ?

**చేతిలో చేట says:**
March 20, 2011 at 3:20 am
"ఘంటల చుట్ట" ఫ్రొం భూతాల్ వర్మ కొత్త సినిమా అండీ!. మొన్న నే విడుదల. నా దగ్గర టికట్లున్నాయ్. ఇస్తే ఎవ్వరూ తీసుకోలా. అందుకే నేనే వెళ్ళి చూసొచ్చా.

**( కవితల) బాక్సర్ మర్డర్రాజా says:**
March 20, 2011 at 4:38 am
Small correction. ఏం బ్లాగో ఏమో, కరక్షన్ ఆప్షన్ లేని బ్లాగు డిజైన్ చేసిందీ దెయ్యంగార్.
హీరో లేక శ్రీకాకుళం ప్రశాంతంగా ఉంది,
సాయంత్రం వైజాగ్ ట్రైనుంది,
ఆ ట్రైన్లో వాడొస్తాడేమోనని గుండెల్లో దడగా ఉంది.

హీరో వంటినుంచి వాసనొస్తోంది.
అది పాచిపళ్ళదని హీరోయిన్ అంటోంది.

ఇప్పుడే ఏదో అగ్ని టపా పేలబోతున్నట్లుగా సంకేతమందింది.
ఎవడికో మూడింది అని తీ(హే)తువుపిట్ట కూసింది.

**( కవితల) బాక్సర్ మర్డర్రాజా says:**
March 20, 2011 at 4:41 am
re-posting
నరకంలో మూడ్ ఎలా ఉందీ
భూగోళంలొ మూడ్ ఎలా ఉందీ
ప్రియా దెయ్యం చిలిపిగా ఉంది,
హీరో గాడికి దూలగా ఉంది,
వాణ్ణి చూసిన దెయ్యాలకి చొంగగా ఉంది,
ఇంట్లో "అమ్మ" కారక్టర్ అరుస్తా ఉంది,
హీరో లేక శ్రీకాకుళం ప్రశాంతంగా ఉంది,
సాయంత్రం వైజాగ్ ట్రైనుంది,
ఆ ట్రైన్లో వాడొస్తాడేమోనని గుండెల్లో దడగా ఉంది.

హీరో వంటినుంచి వాసనొస్తోంది.
అది పాచిపళ్ళదని హీరోయిన్ అంటోంది
ఇప్పుడే ఏదో అగ్ని టపా పేలబోతున్నట్లుగా సెమ్యా సంకేతమందింది.
ఎవడికో మూడింది అని తీ(హే)తువుపిట్ట కూసింది.

**వాసు గిల్లేబుద్ది says:**
March 20, 2011 at 4:44 am
@గోమాత, మీరేమనుకోనంటే నిజం చెప్తా..

"గోమాత మనస్లో మాట" ఇది చూసి చంకలు గుద్దుకున్నా.

**నర్సరావ్పేట says:**
March 20, 2011 at 4:50 am
హబ్బ, ఈ దెయ్యాల చేతులు పడిపోవా ఇక?

**అవినీత చాన్నే says:**
March 20, 2011 at 5:01 am
దేవుడా! నన్నూ నరకం లోకి లాగారా? అయినా ఘోరంగా నా పేరేంటి, అవినీతి చాలానే అని మార్చేసారు. వామ్మో చిత్రగుప్తుడికీ విషయమేలా తిలిసింది. మా ఆఫీస్ వాళ్ళు చూస్తే ఏమనుకుంటారో.

బాబోయ్, నన్ను ఈ ఊబిలో డిస్సాల్వ్ చేయకండి కేడిగొళ్ళెం గారూ.

**ఊరికి పెట్ట - నా కూతే సెపరేటు says:**

March 20, 2011 at 5:17 am
బాబోయ్. నేను నవ్వపులేకపోతున్నా. ఒక్కసారి, చీపాడు టివిలో వస్తున్న “ATM-అన్నీ-గాసిప్ కబుర్లే” ప్రోగ్రాము చూడండి. దంచువారమ్మాయి తరహాలో ధ్వంసీ చేస్తున్న యాంకరింగ్ బెదరగొట్టింది. ఇప్పుడు మిస్సవుతున్న వారు, ఆ పేడకల్లు మళ్లీ ఎప్పుడు వచ్చినా మీద చల్లుకోండి.

**ఇక్నైస్ రాజకీయనాయకుడు says:**
March 20, 2011 at 7:34 am
నాకు ప్రేతాభిషేకం లో పాటలు చదివిన తరువాత నరాల బలహీనత వచ్చింది. దీనిగురించి చర్చించటానికి చర్చ అంటే సదా సిద్దం గుండే ప్రముఖ చర్చా నిపుణుడు పాకశాలా సుత్తి సుఖేష్ గారి తో చర్చించాలి. పోస్ట్ మాడర్నిజం లో కొత్తగా బ్లాగులు చదివితే వచ్చే నరాల బలహీనత, ఆవేశానికి లోను కావటం, లోనై కామేంట్లు రాయటం గాయం సినేమాలో కోటా గారిలా మాటలతో ఖండించటం తప్ప ఎమీ చేయలేము అని తెలిసిన నరాల బలహీనత వలన చర్చలు జర్పకుండా ఉండలేను.



**నగ్మాకొత్మీర్ షేక్ says:**
March 20, 2011 at 10:00 am
I cant take this “bare” comedy ROFL

**Pravi baby 'kharma' says:**
March 20, 2011 at 10:19 am
ఈ విమర్శ ఇటు ప్రేతాలకీ, అటు పిశాచాలకీ రెండు వర్గాలకీ వర్తిస్తుంది. యముడు వాళ్ల టైమ్‌లో పుంనామ నరకం & రౌరవనరకం అవిభక్త శ్రీకాకుళం జిల్లాలో భాగంగా ఉండేవి. తరువాత భూమి జిల్లాలోకి, తరువాత నరకం జిల్లాలోకి వెళ్లాయి. పఠం (map) మీద గీసిన సోకాల్డ్ సరిహద్దులు దెయ్యాలకి ప్రమాణాలు కావు.
మార్తాండలకు అస్సలు వర్తించవు

**చాలా హింస says:**
March 20, 2011 at 12:30 pm
నీకు పాడెకట్టిన క్షణాన
నాకు కొరివెట్టుకున్న క్షణాన

ఆరిపోయిన చితి కూడా
అనందాన్నిస్తుంది……

నేను నీతో, మనకెట్టిన పిండాల్ని భోంచేసి
పరుగులుతీస్తానంది పిల్లదెయ్యం.
చలికాలం చుట్టలు తగలెట్టుకొని కొరివితో
ఆవలిస్తానంటూన్నది.

ఆరిపోయిన చితి కూడా
అనందాన్నిస్తుంది……

కాట్లో వెచ్చని వెన్నెల
నమిలేస్తానంటున్నది
బండబాదిన బట్టల బర్వు
దించేస్తానంటుంది

ఆరిపోయిన చితి కూడా
అనందాన్నిస్తుంది……

వేపిన ఊపిరి కూడా
మధ్యలో… వేగనంటుంది
బరువెక్కిన బట్టల కత్తెర
బావురుమంటుంది

ఆరిపోయిన చితి కూడా
అనందాన్నిస్తుంది……

**కరీం బీడీ కట్లోళ్ళ ఒంగుల్ దూకుల్ says:**
March 20, 2011 at 4:20 pm

నరక హైవే పై దెయ్యాలు మితిమీరిన వేగంతో ఎగురుతున్నాయి . ఇంతలో పొందికగా నరకం రూల్స్ ని పాటిస్తూ ఆ హైవే పై వస్తోందో దున్నపోతు దయ్యం .యమ భటులు దాన్ని ఆపి, అభినందన పూర్వకంగా తడిమారు . దాని కొములు చూస్తూ, ” సార్,నరక వారోత్సవాల్లో భాగంగా, ట్రాఫిక్ రూల్స్ ని పాటించే దున్నలని ఈ రోజు సత్కరిస్తున్నాము. అందులో మీరు నూరవ దున్న .. మీరు మా కింకరుల తరపున పది గడ్డి మోపులు బహుమతి గా పొందారు. గడ్డి మేయండి “ అంటూ మోపు అందించారు. ” బై ది బై , ఈ మోపుని ఎలా నెమరు వేస్తారు సార్” అని నవ్వుతూ అడిగాడో కింకరుడు.

**వీకెండ్ జంటిల్మన్, వీక్‌డేస్ టూహెడ్ స్నేక్‌మాన్ says:**
March 20, 2011 at 6:20 pm
ఓహ్ ప్రియా దెయ్యమయిందా!!. హ్మ్మ్ , గీచా కి సిస్టంలోనే ఉండి, సిస్టంతో ఎలా పోరాడి గెలవాలో, మల్టిపుల్ అవతారాలని ఎలా అనుమానం రాకుండా మెయింటెయిన్ చేసుకోవాలో తెలియలేదు. నా బ్లాగులు చదవలేదు గీచా. అందుకే అవతారాన్ని చాలించేసాడు.
ప్రియా, నా దగ్గరకి ట్యూషన్ కి రా, నా మాస్క్ తగిలించి, పోస్ట్ మాడర్న్ చర్చలకీ, అండర్వేర్ ఆత్మజ్ఞాన ప్రభోదాలకీ తీసుకెళ్తా. ఇక నీకెప్పటకీ చావులేదు.

**భాటిల్య బాదురేయ్ says:**
March 21, 2011 at 10:17 am
చాలా సంవత్సరాల తర్వాత బొనికెల చారు పెట్టా….మర్చిపోయి అన్ని రక్తచారుల్లాగే నరమాంసం ఎక్కువ వేసేశా….అది కాస్త పింజారిచారు అయి కూర్చుంది…□ (…□)…..ప్చ్…బొనికెలచారు తినాలన్న నా కోరిక ఇవ్వాళ్టికి తీరలా…రేపు ప్రయత్నిస్తా….ః)
మళ్ళీ రక్తం తాగుతా….

**సారావ్య V says:**
March 21, 2011 at 10:32 am
ఈ పదార్థాన్ని మీ ఊర్లో ఏమంటారు ?

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:09 pm
http://neelahamsa.blogspot.com/
తవికలు చూసి తగలెట్టండి

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:10 pm
వికృత అజ్ఞానం తప్ప విలయతాండవం నేర్పడానికి రాని ఎదవ!

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:10 pm
పిశాచాల బరువు తప్ప పిల్ల దెయ్యాల బరువు తెలపని , దెయ్యాలకి దారి చూపని శుంఠ!

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:10 pm
కప్పలు తప్ప కర్పూరాలు తేని పడవ!

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:11 pm
బొక్కల జ్ఞానం తప్ప బొమికల జ్ఞానం నేర్పని గాడిద

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:11 pm
గోతులు తవ్వుతూ పోతే జనాల-గోరీలు ఎప్పుడ్రా కట్టేది?

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:12 pm
శవాలు దాటుకుంటూ పోతే సమాధులు కట్టడం ఎప్పుడు రా నేర్చుకునేది.

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:13 pm
నువ్ చచ్చి ఏ పైత్య బ్లాగు లోనో ప్రేత కవిత గా పుడతావు రా….మా కేంట్రా ఈ చావు?

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:14 pm
వొరేయ్,చదువు పూర్తి చేసి బ్లాగ్ లోకం మీదికొస్తే, ఎందుకు రా రాసిన కామెంట్ అగ్రిగేటర్ లో లేదు? నీ పిత్రు ప్రేతం

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:15 pm
హమ్మ ప్రేతాత్మా.. నీ మొహం … కాలా..

**చాలా హింస చాలా………… says:**
March 22, 2011 at 5:15 pm


**visitor says:**
March 22, 2011 at 5:38 pm
ha ha ha

**జమాలీ says:**
March 22, 2011 at 5:42 pm
సరే, ఆ దెయ్యాలంతా వ్రాసినది ఏ౦టి.ఏదో యధాశక్తి ఒకరిద్దరిని, పనిలో పనిగా పాత పిశాచాలని బిరుదులతో సత్కరి౦చడ౦.

నా పేరు చూడగానే, ఒక రెండు వ్యాఖ్యలు ఇక్కడ వ్రాసింది కూడా ఆ దెయ్యాలే (నిజానికి నేను సోదిలక్ష్మిగారికి సపోర్ట్ గానే వ్రాశాను.).

**ఫేక్ మోతీ says:**
March 22, 2011 at 5:48 pm
జమాలి గారు అన్నదాంట్లో తప్పేం ఉందో నాకు అర్థం కావటం లేదు. రక్తం తాగడం రాకపోతే ఎవరిని విమర్శించకూడదని పై దెయ్యాల అభిప్రాయం కాబోలు.సోదిలక్ష్మి ఎంత మేధావి ఐనా కావొచ్చు కాని ఆవిడ వ్రాతలు చాలమటుకు(ముఖ్యంగా డ్రామాజీ గురించి ) ఎంత హాస్యాస్పదంగా ఉంటాయో అందరికి తెల్సు.ఇంకా వ్రాయాలనే ఉంది కాని ఎక్కువ టైప్ చెయ్యలేను. నా రెండో ఐడీలో తర్వాత కామెంట్ రాయాలి మరి.

**ఫేక్ మోతీ says:**
March 22, 2011 at 5:53 pm
అది మీ అభిమానం మాత్రమే. పోల్చవలసిన అవసరం ఏంటి. దెయ్యాలు రక్తం తాగినా, తాగకున్నా ఆమె వ్రాసుకొంటారు

**ఫేక్ మోతీ says:**
March 22, 2011 at 5:54 pm
అయ్యో ఐడీ మార్చటం మర్చిపోయానే ఇప్పుడెలా?

**సువార్త బెల్లెహెంకోట says:**
March 22, 2011 at 8:18 pm
బాగుందండీ గుజ్జు పురాణం. గుజ్జు మధ్యలోనే ఉండి, గుజ్జు తీసుకొని తినడం మరచిపాయి గుర్రు(GRRR) పెడుతుంటారు తెల్సా కొంతమంది. గుజ్జు విలువ గుజ్జుదే, పప్పుగుత్తి విలువ పప్పుగుత్తిదే.

**బద్దం బొండుమల్లి says:**
March 23, 2011 at 3:29 am
బాగుందండీ హీరో హీరోయిన్ల సినిమా పరిచయము. మళ్ళీ హీరో కామెంట్లు వెతికి చదివించారు నా చేత. నా దగ్గర 5 పుస్తకాల సెట్ ఉంది. "ఆయన కామెంట్లు-నా వాంతులూ" అనే సంపుటి ఎప్పటి నుండో రాయాల్సిన లిస్టులో ఉన్నా కూడా కుదరటం లేదు ఏంటో. ఈ సారి వైజాగ్ ట్రైన్లో శ్రీకాకుళం వెళ్ళాక ఇంటర్వ్యూ చేసి, కవర్ పేజీ మీద ఫోటోతో సహా పబ్లిష్ చేస్తా లెండి.

**చాలా హింస చాలా............ says:**
March 23, 2011 at 6:52 pm
కొరివి దెయ్యాలకి రెక్కలు మాత్రమే ఉంటాయి కానీ, కొమ్ములుండవు!
అవి తొంగి చూడవు , వంగలేవు, నెత్తి కాలితే నడవలేవు..

**నెత్తి కాలితే నడవలేవు.. says:**
March 25, 2011 at 11:41 am
wow what a story

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 2:57 pm
కొరివి దెయ్యాలకి రెక్కలు మాత్రమే ఉంటాయి కానీ, కొమ్ములుండవు!
అవి తొంగి చూడవు , వంగలేవు, నెత్తి కాలితే నడవలేవు..

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:04 pm
సమాధి లో చేరిన పీనుగ ఝుమ్మని కొట్టిన వాసనిది
పీనుగ వీడిన మరణం దాటిన నక్కలు చేసిన తీయని గానమది
తన్మయ ఢాకిని కాకిలా అతిగా అరిచిన మంత్రమది
కపాల రాసాల జలాలు లయగా విడిచిన వాంతి అది . . .

….పైత్య

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:15 pm
ప్రియాదెయ్యం గార్ బొమ్మ బాగుంది…ప్రియా – ప్రేతాచార్య ఇద్దరూ కవలలు!
గుర్రాన్ని గుమ్మం దాకా లాక్కు వచ్చేది ప్రియ , గుమ్మాన్ని తిరిగి గుర్రం దాకా తీసుకెళ్ళే కపాల మున్నవాడు ప్రేతాచార్య,.

పేరంటం – పోరాటం.

అస్థిపంజరాన్ని నిలబెట్టుకోవాలన్న పేరంటం ప్రియ ది , నిలబెట్టటానికై పోరాటం ప్రేతాచార్యది .

ప్చ్ …..ప్రియపోయినా , ప్రేతం చావదూ.

-పైత్య

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:17 pm
రక్త కన్నీరెందుకంటే!…

" పిశాచమెప్పుడూ ప్రశ్నించదు…
కపాల మెప్పుడూ సమాధాన పడదు!! "
-పైత్య

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:23 pm

"సమాధుల తో శవాలని దాచి నట్లు
సౌందర్యం తో దెయ్యాలని దోచి నట్లు
లేతగబ్బిలం కుళ్ళిన కపాలాలని దాస్తుంది
ఆటపట్టించి మన్ను తినేస్తుంది…."

-పైత్య
**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:26 pm
దెయ్యాల్ని మీరు ఎక్కడ వెతుక్కుంటారో అక్కడికే వెల్లండి !
ఆత్మ ,ప్రేతాత్మ , శాఖినీ , పిశాచం 'అన్నీ'
వాటంతట అవే, మీ వెనకాలే వస్తాయ్.

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:28 pm
పాత పాడెలు కొంటాం, పాత కుండలు కోంటాం, పాత కట్టెలు …. ….

………………………..నీకేంటోయ్…చచ్చినోడివి!, ఏమైనా కొంటావ్ !!…

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:31 pm
వాతపెట్టించు కోవడంలో ,వాంతులు చేసు కోవడంలో ఉన్నంతానందం….
తెగులు తెచ్చుకోవడం లో తగలెట్టిన్చుకోవడంలో ఎక్కండుంటది !?

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:33 pm
ప్రేతాలూ, పిశాచాలూ ఒకటా రెండా, వందలు వేలూ వుంటాయి.
ఏ తోడూ రాకపోయినా దెయ్యాల తోడుంటానంటాయి.
-పైత్య

**చాలా హింస చాలా...... says:**
March 25, 2011 at 3:34 pm
మన దివంగతం పట్ల మన అధోగతం
మనకు అధోగతమైతేనే అది నిజమైన అసభ్యమైతది.

**Kumar N says:**
March 25, 2011 at 4:45 pm
వార్నీ ఈ చాలాహింస ఎవరో కానీ, పంచ్ బాగుంది. ఇదంతా దేని గురించో నాకు తెలీదు కానీ, ఈ కామెంట్లు చదువుతుంటే , కొరడా ఝుళిపించిన తర్వాత, గాలిలోంచి వెళ్ళే 'జుమ్మ్మ్మ్మ్మ్' అన్న నాదం, ధ్వని కాలుష్యం లేకుండా చెవులకు వినపడుతోంది. :-))

………………………..నీకేంటోయ్…చచ్చినోడివి!, ఏమైనా కొంటావ్ …..Ha Ha Ha baga navvochindi

**చాలా హింస చాలా............ says:**
March 26, 2011 at 11:33 am
రెండువైపులా సాన గల్గిన సుత్తి కన్నా పదునైనది బ్లేడు.
వేసిన మేకప్ కన్నా గీసిన గెడ్డం చాలారోజులు ఉండి పోతది!

చేతబడి,బాణామతి,చిల్లంగి , చెడుదృష్టి,పశువుల లాలాజలం, వెర్రి నవ్వు, పిచ్చి-చూపులు, ఇవే క్షుద్ర పూజకి అస్త్రాలు.

చేతబడిలో భాగం చెడుదృష్టి!

మనుషుల ఆధిక్యత ని ఒప్పుకోలేని వాడు బావిలోకి దూకుతాడు .
పిచ్చివాడిపై ఆధిక్యతని చూపలేని వాడు గోతిలోకి దూకుతాడు.
చేతలు చేయడానికి చేత కాని వాడు చెట్లెక్కుతాడు.
తనకి తాను చెప్పెట్టి కొట్టుకోలేని వాడు చేతబడులు చేస్తాడు.
మాటలతో ఒప్పించలేని వాడు మన్నులో దొర్లుతాడు.
అవేమాటలతోనే అప్పు తెచ్చుకోవాలనుకునే వాడు కప్పులు కడుగుతాడు.
దాహం తో వున్న పేదవాడూ నీళ్ళు తాగుతాడు.
అదే దాహం తఒ ఉన్న ధనవంతుడు స్పిరిట్ తాగుతాడు.
ఇంకా బలిసి ఉన్నవాడు పురుగుల మందు తాగుతాడు
సొంత శ్మశానం లేక సొంత -సమాధి- భూతాల తో మెప్పు పొందాలనే ఆరాటం ఉన్నవాడూ హేళనకి దిగుతాడు.

హత్యలు చేసేవారికి ఇది …

వ్యాకరణం పరంగా ఒక వంకరతనం .
సామాజిక పరంగా సర్వనాశనం .
మానసికంగా ఒక ముసుగులో గుద్దులాట
భిక్షాటన పరంగా ఒక ఆటంకం.
క్షామ పరంగా ఒక కీటకం.

గొడ్డుకారం తో , వేపాకులతో చేసిన ద్రావణాన్నిజుట్టుకు రాసుకొని ఆనంద పడే వాడు నిజంగా రాక్షసుడే!
నిజమైన శీలహీనుడు ,సమాధి కాపరి ఎదుటివారిని హేళన పరచడు.
శీలం లేనివాడు,దారాలూ , దూదీ కల వాడు మాత్రమే ఎదుటివారికి . (దురాభిమాని అంటే వాడు దెయ్యం అని వాడికి తెలిసికూడా ఒప్పుకోని వాడు.)

హారతి తో ఎదుటివారిని హరించవచ్చు , పరాభవించవచ్చు అనుకోవడం కూడా గ్రహపాటే! కాని గురుగ్రహానికి మాత్రం గురవుతాం, మట్టితో మనం చేసే మిడతల గుంపు మనకు తెలియకుండానే శత్రువులని తయారుచేసిపెడ్తుంది. ప్రతీకారం తరాలు దాటినా వరాలిస్తుంది.

మనవైపు మూగదెయ్యమున్నా ,అస్తిపంజరాన్ని ఆయుధం గా మలుచుకోవడం వల్ల నెత్తురు కూడా మనలని వదలి వెలుతుంది.. మన ఎముకలని బలహీన పరుస్తుంది.

తనకి దెయ్యం పడితే , మరగుజ్జులు మూర్ఖం గా వ్యవహరిస్తారు….
దురాభిమానులు దురదతో వీపు గోక్కుంటారు.

ఒకడు హేళన చేస్తున్నప్పుడు …..
ఊపిరి బిగబట్టి మెదడు ఉపయోగించకుండా సమాధానం చెప్పడం ఉత్తముల లక్షణం.
ముక్కు చీది సమాధానం చెప్పడం మధ్యముల లక్షణం.
నెత్తురు అత్తరులా చిలకరించి అరవడం అధముల లక్షణం.

నిజమైన నీచుడు తన నీడలో లో మొహం చూసుకుంటాడు.

ఏది ఏమైనా …… ఇప్పటికే పిశాచం గా మారిన వారికి నామాటలు పిచ్చిగా అనిపించ వచ్చు!.
**చాలా హింస చాలా………… says:**
March 26, 2011 at 7:45 pm
ఇలాంటివి చాల చాలా రాశాను శ్మశానం లో కూర్చొని
neelahamsa.blogspot.com

**చాలా హింస చాలా………… says:**
March 26, 2011 at 7:46 pm
ప్రియా దెయ్యంగార్ బాగుందీ, పలానా కారణం వల్ల బాగుందీ అని తెలియజేస్తే చాలు.పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నా

**చాలా హింస చాలా………… says:**
March 26, 2011 at 7:46 pm
నీ భావాలు పిశాచాన్ని పట్టుకునేదాకా వెళ్తున్నాయ్
నీ ప్రయత్నాలు దెయ్యాలతో మాటాడించేదాకా వెళ్తున్నాయ్
నీ మొహం లో జిడ్డు చీకట్లో కూడా స్పష్టంగా కనిపిస్తుంది.
నీ పిచ్చిచూపు పాడె మీద శవం లా నిశ్చలంగా నిలబడుతుంది
నీ పరుగులు భూతాలని బుకాయిస్తున్నాయి.
నీ అలోచనలు అరిటి కాయలని ఆరాధిస్తున్నాయి.

ఇ మాటలన్నీ నా కవితా పైత్యాల సారమే…

అందుకోండి..

మీ శ్మశానం లో గొయ్యితవ్వాను.
కూలి డబ్బులు ఇంకా ఇవ్వలేదు

**Kumar N says:**
March 27, 2011 at 8:39 am
Bapre…..Meeku JOhaaaar 🙂 F….ng hillarious. Why don't you write some blog..oh wait. do you already have one?

**చాలా హింస చాలా………… says:**
March 29, 2011 at 6:10 pm
సమాధి తో శవం:
ఎన్ని సార్లు నన్నునేను
కోల్పోయి నిన్నుతాకినా
అసలేమీ తెలియనట్టు
జరగనైనా జరగవు

కడివెడూ నీళ్ళ తాకిడితో
నిన్ను ముంచి వేసినా
బండరాతివి నీవు
మొరగనైనా మొరగవు.

పీడిస్చకు నన్ను,
తవ్వించకు నా గోతిని
నా పై వేసై మట్టి పెళ్ళు
లేదంటే కుళ్ళీన శవాన్ని

శవం తో సమాధి :

మట్టీ కుప్పవై తాకితే
కప్పుకుంటాను నేను.
కడివెడు నీటివై దూకితే
కృంగి పోతాను !

తప్పకుండా నిన్ను,
కప్పెట్టుకున్న సమాధిని.
అనుక్షణం నిన్నే శుష్కిస్తూ ,

నీలో పెంచుతా దెయ్యాన్ని !!
—పైత్య
**చాలా హింస చాలా............ says:**
April 7, 2011 at 5:40 pm
కాలింది కాల్చలేదు .. కానీ చచ్చినది పూడ్చలేదు!

"కొరివి":

కాలింది కాల్చలేదు ….. కాని
చచ్చినది
పూడ్చలేదు

కాటికాపరీ
మనుషులనిమార్చలేడు….. కాని
శవాలు కాల్చడం
మానలేడు

అప్పులు తీర్చలేడు….. కాని
శవాల డప్పులు
వదులుకోడు

కాటికిచేర్చలేడు….. కాని
కాటికి దారి
చూపుతాడు

ప్రాణాన్నివదులుతాడు….. కాని
ప్రేతాన్ని
వదలలేడు

శంఖాన్నిఇవ్వలేడు….. కాని
శబ్దాన్ని
పెంచుతాడు

హద్దుమీరుతాడు ….. కాని
హడలి
పోడు

బావి లో దూకలేడు …. కాని
భూమి లో
ఇమడుతాడు

-పైత్య

**చాలా హింస చాలా............ says:**
April 7, 2011 at 5:42 pm
వరుసగా మూడవ సారి కాటి లో నా భవిత!

పుచ్చిన కవిత:

బతికుండీ, బతకలేకుంటే
చచ్చిపోవడం మంచిది….!
శవమై వుండీ, శెలవు తీసుకోలేకుంటే
దెయ్యమవ్వడం మంచిది…!!

ఎటూకాలకా, కట్టెలు లేక,
కాల్చడం తెలీక, కిరోసిన్ లేక,
వర్షం వెలిసీ, శవం తడిసీ,
నిప్పులు ఆరక , నిగ్గు తేల్చక,

అగమ్యపయనం-శ్మశాన యానం
కడివెడు నెత్తుటి తో తీరదు దాహం!!
మనసులనెరిగీ, ఆత్మల అహము!
ముదురు ప్రేతాలకి తీరని రోగం !!!

-పైత్య

**చాలా హింస చాలా............ says:**
April 7, 2011 at 6:06 pm
పిచ్చి పిచ్చిగా నీ ప్రేతాన్నే ప్రేమించిన నాకు
పిచ్చెక్కిన నీ భూతం కనిపించి పిలిచింది
నీదొక పుచ్చిన పాత సమాధి..

-పైత్య

**phani says:**
April 10, 2011 at 1:36 pm
దయ్యాల కాలమానంలో నేల మీద ఎన్ని నెలలు ఒక ప్రేత రోజు అవుతుంది? ప్రిప్రిప్రియ పోస్ట్ చేసి నేల మీద సుమారు నెల అవుతోంది. తరువాతి పోస్ట్ ఎప్పుడు? శ్మశానంలో పాడె రిజర్వ్ చేయించుకోవాలి కదా!

**చాలా హింస చాలా………… says:**
April 11, 2011 at 5:49 pm
పిశాచాలన్నీ ఇప్పుడు సిద్ధమే
శ్మశానమంతా సనద్ధమే!
ఆకలెరుగని ఆడదెయ్యాల పయనమే
క్షుద్ర మాంత్రికుల పై ఇక యుద్ధమే!

చేతులని చీల్చే కరవాలము.
పాడిచేస్తే పోయే ప్రాణము.
తుళ్ళిన రక్తపు ధారనాపే
కుళ్ళిన శవాల జననము

శ్మశానం వీడక ఈ క్షణం
సమాధి అన్నది నివాసం
దెయ్యం చావక ఈ భయం
సంకరం చేసేయ్ అనుదినం

కాలిన శవమే మనబలం
అని వికృతి చెందిన రాక్షస బలం
కుళ్ళిన సైతాను కురుల పగుళ్ళలో
కుచ్చి నిండిన క్షుద్రబిలం!

-పైత్య

**వీకెండ్ పొలిటీషియన్ says:**
May 4, 2011 at 9:10 am
ప్రియా దెయ్యంగారు గారు,

అక్కడెవడో మా బ్లాగు లోకంలో మీ శైలిని కాపీ కొట్టాలని విపరీతంగా ట్రై చేస్తున్నాడు ఒక చూపు చూసుకోండి. 😉

**కొరివి దెయ్యం says:**
July 20, 2011 at 6:42 pm
దెయ్యంగారు, మీ ప్రవి బేబీ పాటలు పాడేసారు.
వినండి

http://audios.teluguwebmedia.in/

**Blog at WordPress.com.**